

దీపావళి

చిత్రకారుడు.

శ్రీ కందాల సత్యనారాయణగారు.

# అంజలి



సాధన సమితి

△ సికింద్రాబాదు △



అధ్యక్షులు: (1939-40)

శ్రీయుత నెల్లూరి రామమూర్తిగారు

# తొలినుడి

గతశ్రావణంలో సర్వమంగళ సమతూన తెనుగుకన్నె తీయనిగళం మాతృస్తుతిగా మంగళ గీతాల్ని వర్షిస్తూంటే కళా దేవతకంజలి పట్టినాము.

గురుతుల్యులైన బ్రహ్మశ్రీలు తూములూరి శివరామ కృష్ణమూర్తిశాస్త్రి, సరిపెల్ల విశ్వనాధశాస్త్రిగార్ల పవిత్రాశీస్సులందుకొన్న మా 'ప్రత్యూష' వ్రాతపత్రిక తిన్నని నడలతో తీసుకొచ్చింది మమ్మల్ని ఉగాదిదాకా, లేఖకులైన శ్రీ విష్ణుభొట్ల కామేశ్వర్రావుగారి అనుపమకృషిచే.

ఈ పట్టునమాలో ఉత్సాహులైన యువకళాప్రియుల్ని కొందర్ని బయటిలోకానికి పరిచయం కలిగిస్తూ ఉగాది కానుక నందచేయాలనే సంకల్పానికి మా "అంజలి" ప్రతిఫలం. ఇట్లాగే దీనివెనువెంట కథల్ని, నాటికాల్నికూడా కొన్నిటిని సంపుటీకరించాలని ఆశయం. ఈ ఉద్యమమునకు సహాయము చేసిన సేటు మోతీలాల్‌గారికి కృతజ్ఞతా నమస్సులు.

మనీషులీ మా తొలినుడులను పితృ ప్రేమతో స్వీకరించాలి.

సికింద్రాబాదు.
చైత్రశుద్ధ పాడ్యమి, విక్రమ.

కార్యదర్శి,
సాధన సమితి.

## అంజలి

**చిత్రము:**

దీపావళి

**కృతులు:**

నారాణి

దివ్యగీతి

మార్గపక్షి

ఒకనాటి సంధ్యవేళ

తన్మయత

ఏమో!

ఆవేదన

విరహి

మేల్కొలుపు

ముక్తి?

బుద్ధునితో

బెదరుగుండె

స్మృతి

కర్తవ్యము

[సర్వస్వామ్యములు సమితివి.]

# నా రా ణి

గాలుల్ని తోడుగా జేసికొని
వాగుల్ని వెంటతా బెట్టుకొని
అడుగులో అడుగేసి
అరుదెంచు నారాణి!

పక్షులా కలకలపుసవ్వడిలో
ఆవులా మువ్వలా సందడిలో
సవ్వడే సలుపకే
సనుదెంచు నారాణి!

సందెపడతీ పమిటలో దాగి
పిందె వెన్నెలా కన్నులేమూసి
ఒంటరిగ పదిలెములో
ఒదిగొచ్చు నారాణి!

*

సరసులో హంసలతో చదువుకొని
వనమయూరాలతో వల్లెవేసి
వాయ్యారి నడలతో
వచ్చేను నారాణి!

పన్నగా ల్నృత్య భంగిమదెల్ప
ప్రవాహా ల్నాట్య పాఠముజెప్ప
నటనంపు నడలతో
నర్తించు నారాణి!

సంద్రింపుకెరటాల సరణిగా
గర్భిణీమేఘాల విధముగా
ఊగేటి నడలతో
ఉరికొచ్చు నారాణి!

*

కోకిలపు గీతముతో కృతినంది
సెలయేళ్ల గానముతో శృతిజేసి
పగడంపు పెడిమెలూ
కదిలించు నారాణి!

పంజరపు చిలుకతో బంచుకొని
నాణెంపు వీణతో నడకగొని
తీయనీ రాగాల
తేలించు నారాణి!

నిశ్శబ్ద వనితతో చెలిమిగోని
నిద్రించు లోకముతో కరుణగోని
తేనెగుసగుసలతో
తేర్పించు నారాణి !

*

చంద్రుణ్ణి సాక్షిగా బెట్టుకొని
ప్రేమమే గుర్తుగా జేసికొని
మనసునూ మనసునూ
ముడివేయమంటాది !

పత్రాల్ని శిరమునా యుంచుకొని
చేతుల్ని రెంటినీ పట్టుకొని
ఒరులనూ ఒల్లనని
ఒట్టెట్టు మంటాది !

సుందరపు కుసుమడోలిక జేరి
కుందరదనసోయగమున సోలి
కారుణ్య కానుకగ
కౌగిలీ మంటాది !

అనిశమూ రాత్రిళ్లే
అమరవలె నంటాది!
ప్రేమతో జంటగా
ఉండవలె నంటాది!
కలనైన యెడబాటు
కనగూడ దంటాది!

*

బాలభానుని రాక తెలుపంగ
జంతుజాలము మేలు కొలుపంగ
కూత కూసెను కోడి
'కోకో' రవము తోడి!

చుక్కలన్నియు నుక్కిపోయినవి
పక్షిసంతతి గూళ్లు వదలినవి,
తూరుపూ కోనలో
తొలిరేఖ దోచగా!

పచ్చనీ పైరుపై తుషారము
ముత్యాలకాంతినే దాల్చినది
తొలికాన్పుపసిరేఖ
తొంగిచూడంగానె !

ఆనందముతో చెట్లుతలలూచె
ఆహ్లాదముతో పద్మములువిచ్చె
పచ్చని ఉషఃకన్నె
పక్కుమని నవ్వగనె !

*

తోకతొక్కినా త్రాచుపోలిక
కోపముతో బుస్సుమనిలేచినది
తొలివెలుగు తనమీద
తగులగనె నారాణి !

సిరి తొలగినా భోగివిధముగా
చింతతో ఉస్సురని ఊర్చినది
రానున్న యెడబాటు
రగులుకొన నారాణి !

పగతోడ మెటికలే విరిచినది
కసిదీర నోరార తిట్టినది
ప్రత్యూష రేఖల్ని
పరికించి నారాణి!

తూరుపూ కోనలో రేఖలకు
తావీయసు్రిక్కినా చుక్కల్ని
ఈర్ష్యాళువులనిబహు
నీసడించును రాణి!

*

చెరిగినా ముంగురుల దిద్దుకొని
చెదరినా పైటనూ సవరించి
దీనముగ నాదిక్కు
తిలకించు నారాణి!

నలగినా పూదండ నందియ
మెలికవడినా గొలుసులందియ
సిగ్గుతో తలవంచి
చెయిజాచు నారాణి!

పూదండ సరిజేయ యత్నించి
పరిమళము చనననీ తపియించి
ప్రేమంపు పూదండ
నలుప వలదంటాది !

గొలుసుల్ని మెడలోన వేసికొని
మెలికల్ని గాంచి లోనుప్పొంగి
ప్రేమంపు గొలుసులూ
విడగూడ దంటాది !

చెమటగల చెక్కిళ్ళ ముద్దిచ్చి
ఆనందముతో రెప్పలరమోడ్చి...
తెలివొంది—నెమ్మదిగ
'పోయివ'త్తంటాది !

*

కొమ్మలో కోయిలా 'కో' యనుచు
పరిణయవృత్తముల ప్రస్తుతింపగ
తలచుకుని తలచుకుని
తావిత్తు నాశలకు !

జంటగా గువ్వలూ జనుచుండి
ప్రణయ వృత్తముల ప్రస్తరింపగ
తీయనీ ఊహాలకు
తావిత్తు మదిలోన !

మధువు గ్రోలెడి మధుపమే తెంచి
ప్రణయ వాక్కులు పల్కుచుండగ
చిత్రాలె చిత్రింతు
కావ్యాలె కలిపింతు !

*　　*　　*

*　　*

*

పిల్లలమఱ్ఱి.........

# దివ్యగీతి

ప్రియవచనముల నర్మోక్తి బిలచి; బదులు
వినియు విననొల్ల కానంద వివశయగుచు
నవని తలమున కొంగు జీరాడు చుండ
మధురలాలన సౌభాగ్య మందిరముకు
నేగ, వెనువెన్కనే నేను నేగినాను.

పరచియుంచిన వెన్నెల పాన్పు జేరి
చిన్ని జాబిల్లి చలువయు చెలువమునకు
తన్మయత్వంబు జెంది సంతసము మీర.

రమణీయాంకతలమ్ము జేర తరుణ ప్రాయంబు దొల్కాడు పూ
ర్ణిమచంద్రాతప రక్షి తాననము నా నేత్రమ్ములన్ మూసె; నా
యమ యేమాయను జేసెనో హృదయ మత్యంతంబుగా బొంగె,
రాగము సంగీతము వ్యాప్తి జెందె దిశలన్ గంధర్వులల్లాడగన్.

విమల గాంధర్వ సంగీత మమరనాద
మతివ కంఠస్వరంబు కోమలము మధుర
మంజుల గళంబులో చందమామ ప్రతిఫ
లించి యుద్రేకమును గూడ బెంచుచుండె.

మెరపుదీవలు హృదయాన మెరసినట్లు
గంధపుం బూత దేహంబు గడగినట్లు
అమృత పూరంబు నందేలియాడినట్లు
వెలది దివ్యానుభవగీతి వింటినేను.

వింటినో లేదో కాని నే వెఱ్ఱినైతి,
నవ నవోన్మేష మధుర గానమ్ములోన
ఆయనంత ప్రకృతిలోన నలిమియున్న
నిరత జయగీతి, లోననే నిలచెమనసు.

"పక్షపాతంబు జూపె నీపైనబ్రహ్మ;
వాణి వీణాస్వరంబును, వంచనముగ
దీసి నవరత్నములుగూర్చి వేసెనీదు
కంఠమున, బిడ్డవైనట్టి కారణమున.

నారదుడు సోదరుండయినందు చేత
పంచియిచ్చెనో తనగాన పటిమనీకు?
మురళి గోపాలుడే విద్యగరపినాడో?
లేక ఓంకార నాదమే సోకినాదో?
కాకయుండిన యిటుల నీకౌనెపాడ?"

బూర్గుల...

# మార్గదర్శి

ఎంత దవ్వుల గలదింక నీప్రదేశ
మెవని మోహన వేణు సంరవము హృదిని
నుడువగా రాని వేదనల్ పొడమ జేయు
నట్టి నానాథు విశ్వమోహనుని జేరు,
మార్గ మిదికాదె తెల్పుమో మార్గదర్శి.

ఎంత దూరము నడచిన నింకనంత
దాలకుఁ సాచునిది యేమిదారి యొక్కొ.
అక్కటకట ! నాజీవితంబంతనిట్లు
లీక వేషణయందె జాలింపవలెనె
సాధ్య సులభమైనట్టి యేసరణి లేదె ?
తెలిపి యీబాధ బాపుమో దివ్యపురుష !

*

శ్రీధర...

# ఒకనాటి సంధ్యవేళ

ఎండలోదినమెల్లా శ్రమపడి యేరిన
యెండిన పుడకల మోపు తో మూపున
కండ్లూ గానక వణకుచు తడబడు
పండూ ముదసలి వెనువెంట .....

పచ్చని గడ్డిమోపుతో కొప్పులో
విచ్చిన చేమంతీ పూవులు మన
సిచ్చీ మాటా మంతీ జరుపా
పచ్చని పైరూ పుక్కిట గాలిగి,
ఊదా రంగూ చీరేకొంగూ
ఎదనూ అంటుక గిలగిల లాడా
పదియారేడుల కాపూ కన్నియ
పదమూ పాడుచు నడిచేను.....

అప్పుడు తోచెను అక్కడ యున్నా
గున్న మామిడీ తోపులో సూర్యుడు
మగ్గరాలెడు మామిడి పండనగ,
పున్నమి చంద్రుడు తూర్పున యువకుల
పొంగెడి తీయని కోర్కెల కరుడనగ.

భాగి...

# తన్మయత

మురిపింప కోప్రభూ !

మరపింప కోయీ !

మరపించి నానుండి

మాయమై పోకోయి !

అలరింప నీదాసి

నాలికించు నీగాన

మలయించు నాభావ

మలయించు నోయీ

మురిపింప ..

నర్తించు నీజాడ

వర్తించు నీబర్హి

నర్తించు నీమనము

నర్తించు నోయీ

మురిపింప...

హాసియింప చంద్రికల్

వెసజిందు నీహాస

ముసిగొల్పు నామోహ
ముసిగొల్పు నోయీ
మురిపింప...

కనలేను నీ హొయల్
మనలేను కనకుండ
కననిమ్ము నిశ్చలత
కననీయు మోయీ!
మురిపింప...

*

సూర్య ప్రకాశ...

# ఏమొ !

ఈ దుఃఖవారాసి యింకునో !
లేదో !
మోదమున నౌక దరి జేరునో !
లేదో !
వెనుగాడ్పు ధాటికి నిలుచునో !
లేదో !
తనలోని మూక వెలిజేర్చునో !
లేదో !
సరివారి మోములను జూచునో !
లేదో !
పెరవారి హాస్యముల విరచునో !
లేదో !
కష్ట కాలము నిండ గడపునో !
లేదో !
నష్టమును వాటిలక నవ్వునో !
లేదో !

పూర్ణచంద్ర...

# ఆవేదన

పుట్టిన దాదిగా భువిని పుణ్య
మదొక్కటి చేయ లేదునే
గిట్టిన మీదటా యముని
కింకరు లేగతి గొట్టు వారలో
ఇట్టటు లాగుచున్నయది చిత్తము
చింతమునింగి దేవి! నా
దిట్ట తనంబొ యెనిక దీనుడ
నన్దయ నేలుమంబరో!

కాయమశాశ్వతంబె యనికారులు
పెల్లుచు కామదాసులై
మాయయటంచు బల్కెద రమాయకతన్
దెలియంగ లేరునీ
మాయ నెరుంగ జాలుదురె? మానవు
లెందునుగారు, ముక్తి లీ
మాయల జిక్కియుండ దయ మాయ
విముక్తుల జేయుమంబరో!

ఎవ్వడనమ్మ? నేనిచట కెచ్చట
నుండరుదెంచితమ్మ? వీ
రెవ్వరు? తెల్పుమాజనని యెచ్చటి
కేగెదనింక మీదటన్?
గవ్వకు గాని నన్నిటుల గప్పెడి
మాయయసంగ నెద్ది? జల్
నవ్వగలన్నిటిన్ గలుగ జేసెడి
శక్తి యదెట్టిదమ్మరో!
ఎందులకో దురంతగతి డెందము
కొందలపాటు నొందు, నా
నందమునొంది యొక్కతరి తాండవ
మాడు మదాంధకారినై
క్రిందును మీదెఱుంగ కపకీర్తికి
లోనగు నొక్కవేళ, నీ
చందములెల్ల గల్గుటపచారమొ
కర్మమొ తెల్పుమంబరో!

*

జోస్యుల...

# విరహి

ఈ హృదయ గుహాలలో
నీ క్లేశ తతి చేరి
కొంప చిలువల రీతి
గోరాడు చుండగా
నీ నిర్మల జ్యోత్స్న
గతి చెల్పనా!
లేక
ధృతి నొంపనా?

గళ గాద్గది కడివిరి
అణచు కొనదలచి, నే
నణచు కొనలేక, లో
నారటంబును జెంద
నీ కోకిలపు బాట
లుసి గొల్పనా!
బెడద
గ్రసి యింప నా!

కలత గుండియలతో
కంపింప నీస్మృతులు
వింటి బాణాల గతి
వెనుదవిలి రాగాను
ఈ పిల్ల తెమ్మెరలు

జో కొట్టనా!
లేక
రే గొట్టనా!

* * *

పయనమై నన్జేరి
పలవించు నారాణి
కన్నీటి జాలులో
కరగి పోయిన నేను
ఏమైతినో...

తిరిగి నా ప్రాణాలు
తెప్పరిల్లిన వేళ
కను విప్పి చూడగా

గాఢాంధకారంబు...

"నాప్రాణ" మీ తమసు

నే జీల్చునో?

లేక

లో నిల్చునో—

భువిని నే నొక్కడను

భూతములతో గలసి

ఆకసంబున నున్న

ఆ కోటి తారలను

గణియించుచూ రేలు

గడపి వేయుటకు!

*

విష్ణుభొట్ల...

# మే ల్కొ లు పు

మురియ బోకుము
మురియ బోకుము
మూడు గడియల మురుపురా యిది
ఇప్పుడుండిన సౌఖ్య మెప్పుడు
కలుగ నేరదురా !

తనువు నిక్కము నూరు వర్షము
లనుచు తలవగ రాదురా యిది
నీటి బుగ్గకు వలెనె నెపుడో
తొలగి పోవును రా!

మేను చక్కని దంచు నుబ్బకు
మురికి తోలును అస్థిపంజర
మందుజిక్కిన చిలుకరా, యిది
ఘోర నరకము రా!

గాలి లోన మెలంగు దీపిక
చందమగు నీమనికి రా! కలి
పాశ బద్ధులమైన మనమిం
దెంత యల్పులము రా!

తల్లి దండ్రియు నాలు బిడ్డల
మోహ భ్రాంతిని వీడరా! యిది
తెరలో యాడిన నాటకము వలె
బూటకంబగు రా!

బాలయ్య.

# ముక్తి?

కన్నీటి
　　సెలయేరు
కడబట్ట
　　లేదూ,

మనసున
　　కోర్కెలూ
మాయనే
　　లేదూ,

బ్రదుకున
　　కష్టాల
పాలెరుగ
　　లేదూ,

సౌఖ్యాల
　　నింకనూ
చవిజూడ
　　లేదూ,

జగతిజీ
    వనసార
మరయనే
    లేమూ,

బాహ్యవృ
    త్తులనింక
బాయనే
    లేదూ,

భక్తివి
    ముక్తులూ
నాకేడ
    నోయీ !

*

ముదిగొండ...

# బుద్ధునితో

అన్న ! యిదియేమి పాపమో యటులనీవు
సర్వమును రోసి నడిరేయి సాగిపోతి;
వెనుక ముందులుఁగానక వెడలిపోదె ?
అకటకట ! యెంత కాఠిన్యమయ్య నీకు !

క్రుంగి మేఘాలలో గూఢుడయ్యె విధుండు
చక్కని నెమ్మోము స్రుక్కి వ్రావ
కురిసెను దుఃఖాశ్రు వరదలంబెల్లున
మొగము వాయఁగ నేడ్చె మొగులుజేడు
ఎదురేగి నిన్నాపి యిల్లుఁజేర్పగ నలిపె
ఘోరయత్నముల సమీరణుండు
నల్ల మేలిముసుగు నవ్వచ్చె వలచినిన్
వ్రతభంగ మొనరింప రజనికాంత

అట్టుసాచుచుఁజూచె సౌధాగ్ర శిఖరి
పులుకు పుల్కున నలదీపకళిక గనిమె;
నిన్ను విడలేక విలపించి రన్న ! నీవు
గడపదాటిన యలనాటి నడికిరేయి.

శ్రీధర...

# బెదరుగుండె

ప్రతి కబళము కోక
　　రక్తపు బొట్టూ
అడు గడుగున కోక
　　హాహా కారం
మెట్టు మెట్టు కోక
　　మానవ దేహం
గళగళమున నోక
　　కపాల మాలా
చేత చేత నోక
　　విషాక్త శస్త్రం
చెవుల్ గింగురన
　　వికటపు హాసం
ఎచ్చట జూచిన
　　రక్తప్రవాహాల్
ఇంట బైట మా–
　　నవ కంకాళాల్
ధింధిమి ధింధిమి
　　ఒకటే నాట్యం
అమ్మా !
భయపెట్తోంది
　　పిశాచపు లోకం !

సూర్య ప్రకాశ...

# స్మృతి

కండ్లజూచియు గన్నులు చూడకుండ
వినుట కాసించి వీనులు వినకయుండ
ప్రకృతికి ప్రతియాచీ నిశావడతి భయద
గాన శృంగారలహరిని మునిగియుండె.

మృత్యుదేవిని మృత్యు లేమించునేమొ !
లోకులకు లోకమే లేక లోపమగునో !
మన్ను మిన్నును యేకమై మనునో యేమొ !
గాక బ్రహ్మాండ మెల్ల నీచీకటుల ?

దుఃఖమున సౌఖ్య మొకవేళ దోపకున్న
చీకటిని వెల్తు రొకవేళ లేకయున్న
భీతిని ప్రమోద మొకవేళ వెలయకున్న
జనక ! యెటుల హాయిగ నిద్ర మునిగితీవు.

దురిత దుర్గంధ దుస్సహ ధూమమయము
గాఢ కల్మష కిల్బిష కలుష పురము
కఠిన కర్కశ కంటక కార్కశ్య యుతము
అకట ! నెట్లుంటివయ్య యీ వాటిలోన ?

పూర్ణచంద్ర...

# కర్తవ్యము

రెండు కోర్కెలు మనసులోపల
మొండికేసుక పెనగు లాడును...

పూలలో వరి పైరులో
పాల వెన్నెల చలువతో
తేలి సాగెడు గాలియూ
దెడు యీలలో......

కోమలుల నెరిసారులో
పలి మెరుపులో......
పసిపాప నవ్వుల రేఖలో
నునుమబ్బు గుల్కెడు తళ్కులో
తేలిపొమ్మను యొక్కటి—

అస్థిరంబగు జగతిలో
స్థావరంబేర్పర్చుక
ఎండమావుల నీటికై
వెంబడించెడు లేడివై
మాయలోపల జిక్కుటల్
తగదు తగదని యొక్కటి—

—విరా

అస్థిరంబగు విశ్వమందున
నేటివస్తువు రేపుయుండని
మాట నిజమేకాని జగతిని
నిముస నిముసము యనుభవించే
నిఖిలవస్తు గుణ గణంబుల
కాదనంచును కళ్లుమూసుక
బ్రదుకు నిల్చుట యెట్టులో—

వస్తువందున దృష్టియుంచి
తత్వమందున మనసునిలిపితి
తత్వమంతయు నొక్కటేయని
ధరణి పెద్దలు చెప్పరా.

భాగి...

జననం : 1912

## కందాళ సత్యనారాయణ.

తెలుసుకో తగ్గవాడీ స్నేహమయుడు తనకళలో పోసనచేత, నిగర్వత చేత. శిల్పి. చిత్రకారుడు. నృత్య గానాల్లో అభినివేశ మున్నవాడు. ఇతని పిపాసకు రవీంద్ర దేవుని శాంతినికేతనంలో స్థాయి చిక్కింది. ఇతని రేఖల్లోని ఉపజ్ఞతా ఉదాత్తతలు నందలాల్ బోసుగారి ప్రియ శిష్యుణ్ణి చేసినవి. అవకాశమున్న అన్ని కళల్లోను అభినివేశం పొంది అధ్యాప కాధ్యాయు లందరికీ మనసు కెక్కినవాడు. కాని, ఇంతలో అదృష్ట దేవత ఈర్ష్యించింది—జీవన సంకులంలోకి పిలుపొచ్చింది. ఈ గతుకుల్లో అతని లోని కళాజ్యోతి కొడిగట్టిందనిపించింది. కాని, కాదు! కళాప్రియుల భాగధేయాన మళ్లీ సమిత్తాని కొస్తూంది. ఇట్లాగే రాను రాను ఇంకా ఉజ్జ్వలమై మార్గదర్శకం కావాలని ఆశయం.

జననం : 1918

## పిల్లలమర్రి వేంకటహనుమంత రావు.

జీవితంలో ఎత్తు పల్లాల నాట్టే యెరుగని అదృష్టజీవి. సున్నిత స్వ భావం. తీయని భావాలు, తీరైన పోకడలతో 'తేనె గుసగుసలతో' తేపించే నేర్పు అప్రయత్నంగా అలవడుతున్న ఆర్ద్రజీవి. చిత్ర గానాల్లో ఇప్పు డిప్పుడే అభినివేశాన్నల వరించుకుంటున్న ఈ లలిత కలాప్రియుడు ముందు ముందంతో అభివృద్ధికి రావలసినవాడు.

కృతులు :—వింత వృత్తం, నీవు, నేను, ప్రభాతం, ప్రసూనం.
దీపకళిక (ఏకాంకిక)

జననం : 1918

బూర్గుల రంగనాథరావు.

కవి. కథకుడు. వ్యాసకర్త. రసార్ద్రమూర్తి ప్రణయైకజీవి రచనలు. ప్రపంచానికి అర్థం కావు. దానికే నిమిత్తం లేదన్నట్లుంటాయి ఈతని కావ్య గానాలూ. ప్రాయిక సాంఘిక సంబంధమున్నా ఎటువంటి ఒత్తిడులలోనూ కళాసేవ మరవని అమితోత్సాహి. ఈ కళాశీలి అవకాశపు మేరలు ఎంతో విశాలం కావాలి.

కృతులు:—ప్రళయాందోళన, టిథానస్ (అనువాదం)

జననం : 1920

సన్నిధానం శ్రీధరశర్మ.

పితృపదంనుంచి అనుగతికమైన సాహిత్యకళే కాక సంగీత చిత్రరచనల్లోనూ సాధన చేసినవాడు. నాట్య కలాపిపాసి. తన స్నేహ హృదయాన్ని ముఖ గభీరతతో ఆచ్ఛాదించుకునే స్వభావం. తన అనుపమ కళోపాస్తితో ఉజ్జ్వల భవితవ్యుడు కాగలడు.

కృతులు:—ఉమర్ ఖయ్యామ్, అర్పణ, అనాథుడను.

జననం : 1912

భాగినారాయణమూర్తి.

స్వచ్ఛందమైన సెలయేటి జాలులాగ. మిసిమి ఒయ్యారాలతోడి కాపుకన్నె కిలారు నవ్వులాగా లోకపు గోడెరుగని గిరిమల్లిక దాగిలిమూ

తల్లాగా, నిసర్గంగా జోకొడుతూంటాయి, ఈతని తలపులూ, పోకడలూ. అభినయకళలో "జా"నని పించుకున్న సహజ సంస్కారి. ఇతని హృదయ సారల్యమితన్ని పల్కరించిన వారికి తెలుసు. ఈతని రసహృదయ మితోధికంగా రసప్రియుల్నితనియింప బూనుకోవాలి.

కృతులు :—కాలమహిమ, వీడ్కోలు, దీపావళి, వలపు, కాపుపడుచు పరీక్షలపుడు. (ప్రహసనము)

జననం : 1920

## జమ్మలమడక సూర్యప్రకాశరావు.

రాయప్రోలువారి లాలిత్యమన్నా, విశ్వనాధవారి వైశిష్ట్యమన్నా అమితాభిమానం. కాదన్నవారితో ఘర్షించటం కూడాకద్దు. లోకంపట్ల కొంచం వత్తుగల్ల స్వభావం. స్వర్గ మర్త్యాల్ని కలపి కట్టాలనే కళాపిపాస. జీవితాశయాలూ, జీవనకర్తవ్యాలలో త్రొక్కుడు పడుతూ ఉజ్జ్వలమైన భావి కోసం ఉర్రూటలూర్తాడు. ఆశయాల్ని బట్టి తేముందు ముందెంతో కళాసేవ చేయవలసినవాడు.

కృతులు :—అజ్ఞాతవృత్తం (ముత్యాల సరాలు), గోపికా స్వాంతము అమృతబాల, సాంధ్యగీతి (ఏకాంకిక)

జననం : 1913

## జమ్మలమడక పూర్ణచంద్రరావు.

ఉన్నతాశయాల్ని ఉన్మేషింప జేసుకునే చిన్నతనంలోనే దైవోపహతినొంది, జీవనోదధిలో మున్మునకలు వేసిన విహ్వల హృదయుడు.

బ్రతుకులో నవ్వుతీరులను భాషలో అనుభవింప జేయగల సంస్కారి. అభినయకళ అభిమానకళ. జీవనపథంలోని అన్యస్తతా మేఘాలీ కళోపాసి నాట్టేరోజులు కళాజగత్తునుండి అచ్ఛాదించ లేవని విశ్వాసం.

కృతులు.—నిస్పృహ, పేరాస, భృంగ పిపాస; ఇందిర, శ్యామల (నాటకాలు)

జననం : 1919

జోస్యుల రాఘవరావు.

సంధియుగ మహాపురుషులైన శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రుల వారంటే అభిమానమూ, ఆదర్శమూను. సహజమైన ధారతో నడుస్తూంటాయి పద్యాలు. గేయాల్లోనూ ఉద్రుతమూ, ఉదాత్తతా గోచరిస్తాయి. ఈ ఉజ్వల భవిష్యత్తుకు దీక్షనిత్తోధికంగా ఉన్మేషింప జేసుకోవాలని ఆశయం.

కృతులు :—ప్రేమ జీవులు, వేశ్య, మరికొన్ని ఖండ కావ్యాలు.

జననం : 1918

విష్ణుభొట్ల కామేశ్వరావు.

జీవితంలోని ఎత్తుపల్లాలనుబట్టి ఇతని రచనలున్నూ కట్టులురలకండా సాగిపోవుటం అరుదు. సంగీతంలో సహజ సంస్కారి. తాత్త్వికప్రియుడు. కృషిస్థాయినందుతున్న ఈతనిరచనల్లో భావి అభివృద్ధికి సూచనలున్నవి.

౨౦ [illegible]

జననం : 1917

మునిగొండ రాజేశ్వరరావు.

భాషాసంస్కార మటుంచి భావుకుడు. చేయూతనిస్తే చరచరా సాగిపోతాడు, నిసర్గ భావాలతో.

జననం : 1918

బి. బాలయ్య.

సాహిత్యపిపాసి. సంస్కారాభిలాషి. ఉన్నతాశయుడు. ప్రోత్సహించాలికాని, తన్నుతాను గుర్తించుకోయత్నించడు. చేసే సాహిత్యోపాసనతోపాటూ చేతకలాన్ని పడితే పైకిరాగలవాడు.



చీకోటి వీరన్న అండు సన్సు ముద్రాక్షరశాల, సికింద్రాబాదు.